ఆంధ్రసంజీవని

అనుబంధ గ్రంథమాల

రెండవ కుసు



# పాంథుఁడు.



గ్రంథకర్తలు

గుమ్మా శ్రీరామరాజకవులు.

---

PRINTED AT THE V. R. C. PRESS,

VIZAGAPATAM.

1922

# కృతజ్ఞత

ఉ॥ మాయ నెఱుంగ నట్టె పితృ మాతృవియోగము సంభవింప నో
లాయము లందకుండ నుప లాలనతో మము బెంచి పత్నిగా
దాయము లిండ్లు భూము లుచితంబుగ నిచ్చి తిరంబు నాడె గా
జేయఁగడంగు ధర్మగుణ సేవధి మత్ప్రియభావుకుండు, నా
రాయణమూర్తి కన్న నితరంబగు దేవు నెఱుంగ మెప్పుడున్.

సీ॥ లలిత మందస్మితాలంకృతంబగు మోము
గోముపాడార్తుల నోముపాడు
వరకరుణారస ప్లావితంబగు చూపు
కోపువాఁడో ర్పంబు నాపువాఁడు
తతవనీపకదరిద్రతమోవంచమునబాన్య
కరిమునా దంభయుం గరిమువాఁడు
నిత్యసత్యాలాప నిష్ఠా గరిష్ఠుఁడై
చెలగునాఁడో నమి గలుగువాఁడు

గీ॥ ఆంధ్ర సారస్వతాభ్యుదయాభిలషిత
భావుకుఁడు మత్ప్రియుండగ భాషింతు
ముద్దుపంకి నారాయణమూర్తి కిపుడు
మతిని నేమాకృతజ్ఞత నతిశయింతు.

విశాఖపట్టణము,
28-4-1922.

గుమ్మా శ్రీరామశాస్త్రి.
గుమ్మా సన్యాసిరాజు.

శ్రీ రా ము లు.

శ్రీ రా మ రా జీ య ము.

# పాంథుడు.

---

సీ॥ తపనోగ్రతరకరా, తపతప్త కాశ్యపీ
తాపోపశమనసంధానకంబు
అతిపిపాసావ్యథార్దితచాతక వ్రాత
కామితఫలసిద్ధి కారకంబు
ప్రధితనర్తన కళాప్రారంభ సంరంభ
మాణమయూర సమ్మానకంబు
దంపతీజనహృదంతర నితాంతరతీశ
క్రీడావినోద ప్రేరేపకంబు
గీ॥ కర్షకామోద సంధాయకంబు, సకల
జలచరోద్భిజ్జవితతి సంజాత హేతు
భూతమమలగ రుద్ధృతి స్ఫోటకంబు
నగుచు గన్పట్టె ప్రావృట్సమాగమంబు॥
ఉ॥ స్ఫారతటిల్లతాప్రసర
సాంద్రవిసీల పయోధరోదితా
పారఘఖండప్రాగనిల
సంచలన ప్రకటన్మహోధరి
త్రిరుహామాదికేయ విభు
దివ్యధనుర్గల చిత్రవర్ణ వి

స్తారకమర్ణవాయితన
దహాద్రికై రవిణీవితానమున్॥ 2

చం॥ సకలజనప్రమోదరన
సంపదనిచ్చెడి వర్షకాలమం
దొకపురుషుండు రాతిరిని
నొంటరియై కమలాపురీపతో,
థికలఁ జరించుచున్ నగర
లీలగనుంగొనమార్గమధ్యముం
దొకపరి నిల్చుచున్ నడచు
చుండె నమోఘమనో వియత్నుఁడై॥ 3

గీ॥ మనుజబాహ్యస్థ వేషంబు గనినమాత్రి
వానిఘనతయు న్యూనత వశమె దెల్పన,
ఆమనుష్యుని వేషంబు నరయ మిగుల
పేదవానిగ దోపించు ప్రేక్షకులకు॥ 4

చం॥ అతనినిగూఢ రూపతిభ
వాతిశయంబును బాహ్యవేషనం
గతిగనుగొన్నచో నిగురు
గప్పిననిప్పు స్ఫురించు నెవ్వడే,
కతన చరించుచుండినది
గమ్యమెదో, వివరం బెరుంగువా
డితరుఁడుగాన రాఁడతని
యిచ్చకు వచ్చినయట్టులాపురిన్॥ 5

ఉ॥ ఏకత నధ్వగామి యటు
లేగుచునుండ వినీలనీరదా,
నీకముచే వియత్తలము
నిండె తటిద్యుతులుల్లసిల్లన
స్తోకతరాశనిధ్వనుల
తోడ మహాత్యతిశీతాంబువృష్టి మే
పోకుట నేమిదోపక వి
శుద్ధసుధామయు సౌధమచ్చటన్॥ 6

చం॥ కని చపలాసహాయతని
కాయముఖస్థితవేదికాతలం,
బు నధివసింపబోయి తడి
పుట్టములొయ్యన నారవిప్పుచున్,
వణకుచునొక్కమూల నిలు
వన్బడియుండ గ్రిమక్రిమంబుగా,
చినుకులు ధారలై కటికి
జీకటిగ్రమ్మ ఘనాఘనౌఘముల్, 7

గీ॥ గుప్పుగుప్పున వలిగాలి రుప్పుచుండె
నెడ తెగక వర్షధారలు పడుచునుండె
పల్లవుం జాయలకు నీరుపారుచుండె
వసుధ నిజపరిమళముల విసరుచుండె॥ 8

ఉ॥ అంత గవాటమున్ దెరచు
నట్లరరారవమధ్వగశ్రుతి

ప్రాంతములందు దోప నటు
వైపు ముఖంబుమరల్చ నాగృహా
భ్యంతరసీమనుండి యొక
వ్యక్తి కరాంచిత కాచదీపికా
కాంతి వెలుంగ నీవలకు
గ్రన్ననవచ్చి సభంబునత్తైశల్॥ 9

మ॥ అవలోకించె వమన్ని కాంతజలధా
రాదభ్రవర్షాభ్రముల్
పవినిర్ఘోషణముల్ సముచ్చలనముల్
ప్రద్యోతవిద్యుల్లతా
నివహంబుల్ గనివిస్మయాకులతచే
నిర్భిన్నచేతస్కుఁడై
భవనస్వామి మనంబునం దెదిరియొన
స్పష్టంబుగాఁ బల్కుచున్॥ 10

మ॥ ధృతిహీనస్థితి లోని కేగుతరినా
ర్ద్రీభూత నేత్రిన్ ప్రకం
పితసర్వోపరిగాఁతు నుద్ధురకృపా
విఖ్యాతచారిత్రునిన్
తతధైర్యావహనేత్రి యాత్రికు గృహా
ధ్యక్షుండు వీక్షించుచున్
మతి నేమేమొ దలంచి వల్కె సనుకం
పాస్ఫూర్తి శోభిల్లగన్॥ 11

చం॥ అతితరవృష్టిబాధ కెటులా
గిరిధరి వ్రిబలవ్రిభంజనా,
హాతులు భరింపగా వశమె, యు
క్కటా! లోపలికేగుదేర విూ,
గతికి నిరోధమున్నదె? యొకా
నొకపాంథుడు వీధివేదికా,
గతుడయి పండ నింటను సుఖం
బుగ నుందురె యాలయాధిపుల్॥ 12

వ॥ అది॥ 13

కం॥ కరమును బహుమానపుర
స్సరముగ గొని ధర్మశాస్త్రసారంబోనా
నరుడుగ నువన్యసింపుచు
సరవిన్ దనయింటిలో వసారాయందున్॥ 14

మ॥ అనపాయంబుగ నుండు విూకచటకి
య్యాయోగ్యవస్తూత్కరం
బనుకూలస్థితి గూర్తురండని గృహో
ద్యుక్తుండు ప్రార్థింపని
ట్లనిమిత్తంబుగ గారవించుటకునే
మైయుండునో స్వార్థకా
రణమట్లుండక బీదవాని ననునే
లాసారె ప్రార్థించెదున్॥ 15

కం॥ పరమార్థచింతనంబో
దురితజననిసర వెంన దోషమొ యీా యాద
రణమునకు కారణమే
పరిశోధింతెద గృహాధిపతిహృదయంబున్॥ 16

చం॥ అని మది నిశ్చయించుకొని యు
ధ్యాగుఁడాతని వెంట లోనికిన్
బనివిని తద్గృహాధిపు నప
ర్యాలనందితుడై కృతజ్ఞ
తా, వినతులనేకముల్ సలిపి
విశ్రమణార్థము ఖట్వ మొందు చూ
పిన శయనించె నెమ్మదిని
వింతగుసందియముల్ జనింపగన్॥ 17

కం॥ తెరువరి శయ్యాస్తరణము
నరసకః గృహమేధి చేరి సరసచో వి
స్ఫురణంబు న్వకీయాంతః
కరణము విశదీకరింపగా నిట్లనియెన్॥ 18

చం॥ పురుషవతంసమా యతిథి పూ
జలొనర్చెడి పుణ్యులెందఱీ
పురమున లేరు చూడ మదపూ
ర్వపురాకృత పుణ్యలేశమా
గురుతరవర్ష కారణమొ
గూర్చెను దుర్లభనీయమైన వీా

దరిసెనమయ్యె యింతకువృథా చ
నుదెంతుఁరా కో భవాదృశుల్॥ 19

చం॥ పథికవరేణ్య మీావిమలపా
దరజఃపరిషిక్తమౌట నే,
డధికపవిత్రవంతమగు న
న్న యలీకమౌ మద్గృహంబు మీా
విధమునమన్త్రమున్ దెలియ వే
డుకబుట్టె భవన్నమాఖ్య నే
ప్రధితసువర్ణవర్ణములు, భా
సిలు కావక వానమెద్దిమో॥ 20

మ॥ ధనమున్నందుకు సార్థకంబతిథి స
త్కారాది పుణ్యక్రియా
వనుఁడై నిశ్చల ధర్మతత్పరత గై
వల్యాంగనాలింగనా
ప్రణయానంత సుఖమొందుకంటె ని
తర వ్యాపారమేమున్నదో,
యనఘా! మాదృశగేహనాయకుల క
శ్రాంతంబనుష్ఠింపగన్॥ 21

గీ॥ విపులధనవంతుఁడవు ధర్మవేదివనుచు
పుణ్యమార్జించుటే పీనిపూనికనుచు
మాటసారి మనంబున నాటుకొనఁగ
పలికె నీరీతి తన్మృదుభణితి పుడు॥ 22

గీ॥ సముచితంబగు ప్రత్యుత్తరముల వడసి
దృప్తివడి, బాటసారి సుషుప్తి జెందు
సూచన లెఱింగి మెల్లన లేచివచ్చి
తాళము బిగించె నాయింటితలుపులకును॥ 23

కం॥ కైతవనిద్రాభినయో
పేతుండగు పాంథుడతని వినయంబెల్లన్
పాతకయుతమని జాగ్రి
చ్చేతుండై పెక్కుగతులఁ జింతించె నిటుల్॥ 24

కం॥ తలుపిటులమాయ నీతని
తలపెటులున్నదియొ ధర్మతత్పరుడనుచున్
దలఁచుటకాత్మస్తుతులన్
వలుపుకొనున ధూర్తవర్తనం బగపడెడిన్॥ 25

ఉ॥ వీనిప్రయత్నముల్ గనిన వి
స్మితమానిపుడెందుకోనమీ
హానిదలంచెనో తెలియదా
యె నటంచు నితాంతయోజనా
దీనమనస్కుడధ్వగుడు తెం
పరియై శయనింపనర్గళ
ధ్వానము వీనులన్ బడఁగ ద్వా
రముపై వు దృగంచలంబులన్॥ 26

కం॥ పరపి గనుంగొనె పాంథుఁడు
ఖరతర కౌక్షేయకలితకరునిన్ సురుభీ

కరునిన్ గృహాధిపరునిన్
పరజీవహృతివ్రతైకపరు కావరునిన్॥ 27

మ॥ అపుడాభీలకరాళఖడ్గకరుఁడు
ద్యస్మృత్యుసంకాశుఁడై
కపటప్రక్రియ తన్వధించుటకు ఖ
డ్గం బెత్తుచుండన్ సమి
న్నిపుణున్ బోలి తదీయఖడ్గమపుడేం
తే నేర్పుతోఁ బట్టి యీ
విపరీతక్రియ కాత్మసంభృత మహా
విభ్రాంతుఁడై యిట్లనున్॥ 28

గీ॥ తగునె మీవంటిసజ్జనోత్తములకిట్లు
పరజనాసువిదారణోద్భవమహాఘ
జాలమున జిక్కి నరకానకూలబడుట
త్వత్కృపారక్షితైకజీవనుఁడగానె॥ 29

కం॥ ఘనవృష్టి నోర్వజాలని
నను బ్రోచియు నిట్లు నాశనంబొనరింపన్
జనునే, తన పోషించెడి,
ఘనతరుశాఖంబు ద్రుంపగాఁ జూచునొకో॥ 30

చం॥ పురుషవతంస నన్ను బోరిపు
చ్చదలంచుటకు న్నిమిత్తమే
నరయఁగ జాలకుంటి గిలనై
నను మీయెషు నెట్టి మోసమున్

జరిపినవాడగాను ధనసం
పదకానవహింతువన్నచో
పరమదరిద్రశేఖరుడ భా
గ్యయుతుండవు నీవుగావుతన్॥ 31

ఉ॥ కారణమొందు గన్పడ దఘ
ప్రతిపాదకదుష్టమౌ మహో
దారుణకర్మమున్ సలుప దై
వసహాయము సంఘటిల్లునే
కారుణికత్వమున్ వలదె ఖం
డనచేసి మదీయమాంసమున్
బారణసేతువే రుధిరపా
నమొనర్తువె రాక్షసుండవే॥ 32

కం॥ నీజీవనమొరుడొకడ
వ్యాజంబుగబట్టి ద్రుంపవచ్చినచో నే
యోజచలించునో నీమది
సాజము సకలప్రపంచజనములకదియే॥ 33

సీ॥ జీవహింసయె తొలుతొల్తఁ జేయకూడ
దందు విజ్ఞానయుతుడగునట్టి మనుజ
హత్యకుగడంగుటెంత దురంతకర్మ
మోదలంపుము దైవమెట్లోర్చు దీని॥ 34

కం॥ కారణము లేకనన్ని
వారణగితి మ్రిందఁజేయ వసుధాధిపుడీ

మారణకర్మమెఱింగిన
ప్రేరణ సేయును ప్రచండశాసనుఁడుగదా। 35

ఉ। పాపముదాఁగదీకొలఁది వం
డినఁదాన తనంతనే పరి
వ్యాపృతమౌనటంచు బహుభం
గులదై వ్యతయున్ గభీరతల్
దోపగ మార్గగుండతనితో
బలుకన్ బదులాడె కర్కశా
లాపములన్ గృహాధిపుఁడల
క్ష్యమనోదర్శిమానియుక్తుఁడై। 36

ఉ॥ దైవసహాయమంచితవిధం
బున నాకొనఁగూడఁబట్టియే
వేవురులక్షలీగతిని వే
గ మదీయనికేతనంబులో
వావిరిఁజొచ్చి మత్కరకృపా
ణసపర్యలఁజెంది స్వస్థతన్
బోవుచునుండ్రి ముందుగతి బో
ల గనుంగొనుటవ్వనర్థ్యగా॥ 37

ఉ। కాలముచెల్లి మామకనికా
యముసొచ్చితి కారణంబుతో
నేల వృథాప్రసంగముల నిం
కనుడుంగుమటన్న పాంథుడా

యాలయునాథుతో నని మహా
నసగేహానిరుద్ధమైన కుం
డేలననుంటి నేభవదధీ
నుడనై యిఁక నెందు బోయెదన్॥ 38

ఉ॥ చంపగడంగినాడ వెక చం
పక మానవు తత్కృతిన్ నివా
రింపయతించు చున్న శశశృం
గముగోరుట దానికై విచా
రింపను గాని యిట్టులొనరిం
చుట కేమిపరియోజనంబొ యూ
హింపగలేక యుంటి దయచే
సి వచింపగదయ్య హేతువున్॥ 39

సీ॥ మరణదండనమును బొందు మానవునకు
నెట్టికోరిక మదినావహించియుండ
తప్పకయు నిర్వహించుట ధర్మమగుట
మన్మనోరథమీడేర్పుమా గృహేశ॥ 40

కం॥ పాపము సేసెడి నీకీ
పాపములో కొంత పుణ్యఫలమబ్బెడు నీ
వ్యాపారములో నష్టం
బేపారదుగాన నిర్వహింపగ వచ్చున్॥ 41

చం॥ పినయునిచేక ధైర్యసముపే
తవిశోచ్యతమప్రసంగముల్

విని పలికెన్ నృశంసనవ్రి
వీఁకను భావమునందదేదియో
మననము చేసి యీగతిని మా
ర్గగ! నిస్వ్యాధియించి మానస
మ్మున ఘనలాభమందెద నిమి
త్త మిదేయన విభ్రమాత్ముడై॥ 42
ఉ॥ విత్తము గోరి గాదె యవివే
కమునాశ యమానుషేయమా
వృత్తిని బూని నన్ను విదళిం
పఁగడంగితి దీనపాత్ర మా
విత్తముకన్న నెక్కుడులభిం
చు నుపాయ మెఱుంగ సేయ న
న్నెత్తలపెట్టకే విడుచుట
త్తమధర్మముగాదె గేహపా॥ 43
ఉ॥ జీవపుభిక్ష నాకు దయచే
సి యొసంగు మజస్రమున్నవ
త్సేవకుభంగినుండి విరచిం
తు విచిత్రవిలేఖనంబులీ
వేవివణిక్స్థలంబులకు నే
గి క్రియింపనగణ్యమూల్యముల్
కైవసమౌ సుఖస్థితులగా
లెద వేటికి పాపకార్యముల్॥ 44

ఉ॥ మామకజీవమెంతయు సమం
చిత పూర్ణసుఖంబునొందు నీ
కామితసిద్ధియౌ నటుల గ
ణ్యధనార్జనమౌను గాన న
న్నొమినిశాతసూచికయు నొ
క్కదుకూలము రంగు దారమున్
ప్రేమనొసంగుమయ్య వివ
రించెద శిల్పకళాప్రవీణతన్। 45
చం॥ పనివడి నేను చేయు నిలువం
పు దుకూలము విక్రయింప నీ
వనుకొనినంతవిత్తము సమా
ర్జనజేయగలాడ నిందులో
నన్నృతము లేదు నీమదికి న
చ్చనియప్పుడు నన్వధించియున్
దనియుము తావకీనపదదా
సుడనై యిక నెందు బోవెదన్। 46
చం॥ అతివినయప్రకర్షితహితా
లపనంబుల కాలయేశుడూ
ర్జితమతి దీర్ఘయోజనము జే
సి తదిష్టములైన వస్తువుల్
జతన మొనర్చి తత్క్షణ మొసం
గగ పొంగి విచిత్రరేఖనా

చతురుడు పాంథుడందుపయి చ
క్కని శిల్పమొనర్చి యిట్లనెన్॥ 47

మ॥ విపణీవీథుల విక్రియార్థమిది చూ
పింపంగరాక్కంబునీ
కువలాభించును మిక్కుటం
బుగనుగాకున్నన్ భవన్మంతలా
ధిపుడత్యంతరసజ్ఞు డీవనికి దృ
ష్టిన్ జెంది తీగోరు మూ
ల్యపదార్థం బొనగూర్చువాడని దు
కూలంబిచ్చినన్ గ్రచ్చరన్॥ 48

గీ॥ బాటసారి వచస్థితిపాటిజేసి
విపణులందున వసనంబు విక్రయింప
బూన నావణికులు దాని మూల్యమడిగి
వేయు టంకంబులన వెనుదీయుచుండె॥ 49

ఉ॥ బాపురె నీకు నూలువలివం
బునకింతటి యర్థమెవ్వఁడీ
నోపు భవన్మనోరథ మహో .
మృగతృష్ణజలంబుఖవ్రినూ
నోపమమంచు నవ్వుకొనుచుం
డెడివారు మహోన్మదుండితం
డీపున జేరమేటికని యే
గుచునుండిరి యాపణిగ్వ్రగుల్॥ 50

గీ॥ ఒక్కటేనియు దాగోరు రొక్కమిచ్చి
యంబరము పుచ్చుకొనమి నోవంబువాడవె
పాంథుపైగాని యింక భూపాలకునకు
జూపవలెనంచు కోటలోఁ జొచ్చెనంత॥ 51

మ॥ సకలామాత్య పురోహితాప్తసు మన
స్స్వామంత భూకాంత సే
వక సైన్యాధిప వందిమాగధ సుహృ
ద్వైతాళికస్యంద్యని
వ్రికరాభోగనిజాయతాస్త్రములై
భాసిల్లు పేరోలగం
బకటా కాంతివిహీనమై బరగె రా
జాభావమై యత్తరిన్॥ 52

సీ॥ కైరవిణీమనో, హారిలేకున్నట్టి
యుడువ్రిపూర్ణాంతరిక్షమనఁగ
వికసత్సరోజనీవిరహితామలపయః
పూరితంబైన కాసారమనఁగ
సర్వాంగసౌష్ఠవసంపద్విభాసిత
విధవాంగనావయోవిభవమనఁగ
చతుర వాగ్విన్యాసవ్రతిభావ్రిలోపిత,
పండిత సాహిత్యపటిమమనఁగ

గీ॥ కీరరాజవ్రిచారాతిదూరమైన
పరసఫలభరితామ్రికి, జంబనంగి,

సకలపరివారసంవృతుఁడై స్థానసీమ
రాజు లేంచుట దోఁచె నిస్తేజముగను॥ 53

గీ॥ ధారిణీశుండు రానేల తడసె ననెడు
వారలీపాటికిని బయల్ చేరు ననెడి
వారలామయమున సుక్కినార లేమొ
యని దలచుచుండె తత్సభాజనము లెల్ల॥ 54

మ॥ మతిమత్తల్లజుఁడౌ సుమంత్రియను నీ
మంతుండు సర్వాంసహా
పతి రాకున్న కతంబెఱింగి యతిగు
ప్తప్రక్రియన్ జేసి యా
తతచింతా పరికుంఠితాస్య జలజా
తంబందు లేనట్టి
సుస్మితముంగూర్చుచుఁ దత్సభన్ సరస
గోష్ఠిం దేల్చివర్తించుచున్।
కుతుకంబున్ వెలిబుచ్చుచున్ జనులతో
గోష్ఠిన్ విడంబించుచున్॥ 55

ఉ॥ కోరికమీర దానెవరికో
నరమో సచివుండు తత్సభా
స్తారులతోడి పాటు రభసం
బునగాంచ స్వచాంతరంగసే
వారతుఁడైన భృత్యుఁడొకఁడ
ప్పుడు వచ్చి శిరోవినేసచా

భారముచేత డస్సినృపవ
ర్యుడమాత్యుని కాదరంబునన్॥ 56

ఉ॥ ఈసభ నిర్వహించుటకు ని
చ్చె ననుజ్ఞయటన్న తత్సభా
గ్రేసరుడై సుమంత్రి వరికిం
పుచునుండగ రాజకార్యముల్
వానవనిగ్వరుండొకడు వ
చ్చి కవాటమునొద్ద నాజ్ఞకై
వేచుట ద్వారపాలకుఁడు వి
న్నపమున్ బొనరింప వైళమున్॥ 57

చం॥ అతసిని దోడితెమ్మనుచు నా
జ్ఞ నొసంగిన నల్లగేహినీ
పతి సదుకూలుడై సభకు వ
చ్చి విచిత్రవిలేఖ నాతిరం
జితవనవరిబొసంగఁ బరిశీ
లనజేసె విమర్శదృష్టితో
నతిమతిమంతుఁడైన సచివా
గ్రసరుంషు సుమంత్రి యెంతయున్॥ 58

ఉ॥ కాంచిన యంత నూతనవికా
సపమున్విత వక్త్రసీమదో
పించు దరస్మితంబుడిపి ప్రే
ష్యకజీరిరహాష్యమేము హో

ఘించి తటాలునన్ బనిచి ధీ
నిధిసత్తముఁడాపటాంతరా
భ్యంచితచిత్రలేఖన కళా
విభవంబు ప్రశంస జేయుచున్॥ 59

గీ॥ వసన విక్రేతతో సచివప్రవరుఁడు
వింత బేరంబులాడుచు విసువుపుట్ట
కాలయాపన జేయ భూకాంతు డదిగో
వచ్చెననునట్టి సంతోషవార్త బుట్టె॥ 60

మ॥ మకుటాంతస్థితరత్నదీధితులతో
మందీభవచ్ఛత్రపా
ళికతో సుందరమందహాసవికస
ల్లీలాస్య బింబంబుతో
ప్రకటీభూతనృపాలచిహ్నములతో
పల్యంకికారోహుఁడై
యకలంకస్థితి వచ్చియున్న నరసిం
హారాయభూపేంద్రునిన్॥ 61

మ॥ సభికశ్రేష్ఠులు గాంచి గౌరవపుర
స్కారంబుగా నమ్రులై
యభివాదాదులొనర్చి దివ్యదుపదా
నాదుల్ సమర్పించి త
త్ప్రభునాజ్ఞప్తి సుఖోపవిష్టులయి మో
దస్ఫూర్తి నుండంగనా

త్రిభయోద్రిక్తిత కంప మాననిజగా
త్రిపా్రితుడై భూపతిన్॥ 62

ఉ॥ చూచినమాత్రి వాసవశిజుం
డు కడుంగడు తోటుపాటుతో
లోచనవారి దృష్టికవరో
ధమొసంగ విషాదయాతనా
వీచికలన్నిమగ్నుడయి వి
భ్రమసంకలితాస్యుడై ఖరిన్
దాచి దురాశదుఃఖములదా
ర్చునటంచు మనంబు దట్టుచున్॥ 63

ఉ॥ నమ్మగనేల పాంసు కుహనా
పదనంబు లమోఘసత్యబ
ద్ధమ్ములుగా స్వకీయచరిత
మ్ము సమస్తమెరుంగజేసి జీ
వమ్ములు దీయకే విడువవ
మ్ప్రెవె జూడ స్వయంకృతాపరా
ధమ్మునరించుకొంటి నిక త
ప్పదు చావు ధరాధినాథుచే॥ 64

కం॥ అనుకొని నిజపాపావన
మున కనువగు మార్గమొండు పొడసూపమి న
వ్వణిజుడు చింతాకులమం
స్వితనుఘర్మాంభోవలిప్తతనుండై యుండెన్॥ 65

మ॥ అతిగంభీరవచోనిగుంభనల న
భ్యశ్రేణి యాలింప తత్
క్షితిభృత్తల్లజు డిద్ధవైదుషి వచిం
చెన్ పౌరులెల్లప్పుడున్
సుతబంధుప్రియమిత్రభృత్యజనమె
చ్చోఁ గానరాకుండె మా
గతియేమంచు విషాదప్రార్థన లసం
ఖ్యాకంబుగా వంపినన్॥ 66

ఉ॥ దేశము వీడజాలరు మదీ
యప్రచండతరానుశాసనో
ద్దేశమెఱింగి తామపరదే
వతలన్ పఱితుష్టిగొల్ప నా
వేశముచే మనుష్యబలివే
సిరోయుంఁటను తన్మతస్థులీ
దేశములోన లేరు చనుదే
రగరాదు మదీయ సీమకున్॥ 67

ఉ॥ చోరులచేత జిక్కిరనుచో
ధనవంతులుగానివారలు
న్నార లనేకు లందు కమనప్ర
కృతిప్రభవాఘమంచు ని
ర్ధారణసేయ వృద్ధులును, దా
రకులున్ గల కీర్ష్యనిష్టివ్యా

పారము జెల్లునా యనుజభా
వము మామక నాగరాళికిన్॥ 68

మ॥ సదయుండౌ భగవంతుడిచ్చిన సుధీ
చాతుర్యవంత్రిచే
హృదయంబందు ననేక భంగులవిత
ర్కింపన్ నిమిత్తంబునా
కిదమిత్థంబని తేలకుండుటయు నే
నేకాకినై దోషులన్
వెదుకన్ మాపుల సంచరించెదను మార్
వేసంబుతో నీపురిన్॥ 69

మ॥ పరమార్థగ్రహణాభిలాషి నగుచున్
ప్రచ్ఛన్నరూపంబుతో
దరమున్ వీడి చరించుచుంటిని వివి
క్త ప్రక్రియన్ రాత్రినీ
పురిశృంగాటచయంబులందున యథా
పూర్వంబుగా నంతటన్
గురియన్ జొచ్చె మహాంబువృష్టి ధరపై
కుంభప్రపాతంబుగన్॥ 70

ఉ॥ ఒక్కవిశాలమందిరసము
న్నతసౌధవితర్ది వృష్టికిన్
జిక్కవడంకుచుండ గృహాసీ
మను వెల్వడివచ్చియొక్కరుం

డక్కడనుండి లోనికి నమా
ద్భుతిన్ గొనిపోయి చక్కగా
పక్కనమర్చి నీతుల నపా
రముగా గురియించుచుండగా॥ 71

చం॥ అతివినయమ్ము ధూర్తసహజా
యితలక్షణమౌట ఘాతుకం
డితడగునేమొ యంచు మదినెం
చి యళీకసుషుప్తి జెంది న
వ్వతితుడతండు ద్రైనిసితవాల
ముతో పరిమార్పఁజూడనే
నతులితధైర్యసంపద నయా
పలనంబుల కేలు పట్టియున్॥ 72

చం॥ కనికరమేది నన్ను శరఘా
తమొనర్చుట కెట్టిలాభమో
వినవలతున్ వచింపుమని వి
హ్వలభావము నాదువక్త్రమం
దెనయఁగ వేడుకొంటిని మది
ష్టవశంవదుడెందుబోవునం
చనుకొనబోలు సర్వము యథా
ర్థముగా వివరించె నీగతిన్॥ 73

గీ॥ పాలనులమ్ము కతన కొట్టపోసికొను క
సాయి వని సరమాంసంబు సారవంత

మగుట వెల యధికంబుగా నబ్బుకతన
నరుఁ బరిమార్తునంచు నా కెరుక సేయ॥ 74
సీ॥ స్వాంతమత్యంత విభ్రమాశ్చర్యచలిత
మై కసాయినిగూర్చి యిట్లంటి నేను
ద్రవ్యమార్జింప పాపకార్యంబొనర్ప
వలయునే భవ్యమార్గంబు దెలుపువాడ॥ 75
ఉ॥ చూపెద నింత కెక్కుడు వసు
వ్రిజమార్జన సేయ నీయసూ
ద్యాపనకర్మకున్ దొడర క
య్యాయటంచును నచ్చ చెప్పి నే
నాపటమందు చిత్రరచనా
కుశలత్వము మీర నక్షర
స్థాపన చేసితచ్చట కసా
యికి జిక్కెటి ముక్తిగోరెదన్॥ 76
సీ॥ చిత్రవర్ణాంచితంబగు చేలమిచ్చి
వేయినిష్కంబులద్దాని విలువ చెప్పి
వణిజులోక వేళ గొనకున్న మనుజవిభుడు
గొనునటంచును పేరాశగొలిపి యుంటి॥ 77
కం॥ వణిజులు తద్వసనంబున్
గొనజాల రమాత్యవరుడు గురితింపగలా
డనియూహించిన యందుల
కనుకూలస్థితి వహించె నన్నియు తీరెన్॥ 78

చం॥ చిన్నతనాన నాకితడు శి
　　ల్పకళారచనారహస్యముల్
　విను చుట నీప్రమాదమున నీ
　　గళ పైబడితంచు భూపుడా
　ఘనతరుడౌ సుమంత్రిని వికా
　　త్థనపూర్వక వాక్ప్రణాళికన్
　ప్రణతులొనర్చ లేచి సచివ
　　ప్రవరుం డుచితోత్తరంబులన్॥ 79

చం॥ ధరణిపు ధైర్యశీల ముచిత
　　జ్ఞత నేర్పును సన్నుతించి మీ
　రరుగు టెగాని మీదుపుర రాగ
　　తి లేమి విచారమందుచున్
　పరులిదివిన్న నెంతయు విప
　　త్కరమంచు శిరోవివేదనా
　భరమున సుక్రిక్కనారలను వా
　　ర్త సభాస్థలి పుట్టజేసియున్॥ 80

గీ॥ చారుల రహస్యగతి తమ జాడ నెరుగ
　బంచి యీసభ నేనిర్వహించుచుండు
　నంతలో వచ్చె నీదుకూలాపణికుడు
　నర్వ మెరిగి నిన్వేడిపింప బూనినాడ॥ 81

చం॥ ఇటుల తదానుపూర్విక ము
　　కృత్స్నముగా వివరించి మంత్రి దె

నాలింవ్రమా మానవాశనోచితజంతు
ఫలలవిక్రయకారి కులమునందు
జనియించితిని కులా, చారమౌ వృత్తిని
అధికలాభంబుల నందిగేహ
మాన్యాదికములు సంపాదించి వాణిజ్య
మంతకంతకు వృద్ధినందజేసి,
గీ॥ స్వల్పలాభంబునకు దృప్తిపడెదువాడ
నగుచు నేనమ్మ పిశితమె నగరిజనము
గొనదొడంగిరి తోడివిపణులడంగె
వానిలాభంబుకూడ నాపాలఁబడియె॥ 88
చం॥ పురవరసీమలో పిశితభు
క్కులకెల్లను నేనుబెట్టు చే
సురుచిరభిక్షయై దనరుచుం
డె దినంబులుకొన్ని యీగతిన్
జరుగుచునుండ వాన దివస
త్రయమొకట కుంభవృష్టిగా
గురియుటబట్టి జంతువులు కో
యుటకున్ లభియింపకుంటచే॥ 89
శా॥ ఖాతాదారులకిచ్చి పుచ్చుకొను మా
ర్గంబేదియున్ దోపకన్
జేతంబున్నతవిత్త నష్టమునకై
చింతించుచులోనవ్వడో

దో తెంచెఁ బలవిక్రియార్థ మపుడెం
తో గారవస్ఫూర్తి నా
హూతిన్ జేసి నిజాంగణంబున వధో
ద్యోగంబు గావించియున్ ॥ 90

ఉ॥ పోడిమితోడనే పిశితభు
క్కులకెల్ల తదీయమాంసమున్
వాడుకఁ జొప్పునన్ బొసఁగ వా
రలు దాని భుజించితోడి తా
రూఢమనస్కులై మిగుల రు
చ్యతరంబగు నట్టి మాంసమున్
పీడకఁ నీవొసంగ ద్విగుణీ
కృతమిత్తుము మూల్యవిత్తముల్ ॥ 91

కం॥ అని నను పేర్కొపింపఁగ
ననువై నపుడెల్ల మానవామిషమున దృ
ప్తి నిజేసి వారికడనే
నినుమడి వెల లందుచుందు నీగతి నుండన్ ॥ 92

చం॥ తమరరుదెంచుటాదిగఁ కథా
విధమెల్ల నెరింగియున్నదే
క్రమమగు న్యాయపద్ధతిని ఖం
డన నేయఁగ వచ్చుఁ గోరికే
దిమనమునందు లేదనుచు తెం
పరియైమరణాక్షకై మహా

ప్రమదముతోడ నుండగ నృపా
లుడు సభ్యులగాంచి యిట్లనెన్॥ 93

ఉ॥ షండుడటంచు మేమితనిబం
ఫుటకాజ్ఞనొసంగనిట్టిదే
రెండవవాహు లేచిపచరిం
పకమూనదు వీనివీడియున్
వంచుగుపూట కూడపలభ
క్షణముంద్యజియించు నట్లుగా
చండతరప్రశాసనము చా
టగజేతు మదీయ సీమలో॥ 94

గీ॥ సభికలెల్లరు నదియుక్త సరణియనుచు
సమ్మతులొసంగ వెంటనే చాటవంచె
నన్యమగువృత్తిలో లాభమందుచుండె
సంతసంబుసనుండె కసాయివాడు॥ 95

గీ॥ ఆంధ్రసంజీవిని గ్రంథహారమందు
కూర్చినారిది యనుబంధకుసుమముగను
లలితసత్కవితాంగనాలంకృతాభి
రాములైనట్టి శ్రీరామరాజకవులు॥ 96

స మా ప్త ము.



